## బుధవారం మార్చి 30

శక 1888 చైత్ర 9

## హైదరాబాద్-ఎ

ఉ॥ ప్రసారము I

405.4 మీ (740 కిలోసై)

6-30* వందేమాతరం, కార్యక్రమ వివరాలు
6-40 ఆంగ్లంలో వార్తలు
6-45 భక్తిరంజని
6-55 సూక్తి ముక్తావళి
7-00 తెలుగులో వార్తలు
7-15 లలిత సంగీతం: ఎమ్. సునంద
7-30 వీణ: నిలయవిద్వాంసుడు
7-45 శంకర రావు: సితార్
8-00 ఆంగ్లంలో వార్తలు
8-15 సంకీర్తనం
8-30 వి. ఆర్. ధనం
ప్రణమామ్యహం-గౌళ (ఆది) వాసుదేవాచార్య
జ్ఞానమొసగరాదా-పూర్వి కల్యాణి (రూపకం) త్యాగరాజు
సరసిజనాభ సోదరి-నాగగాంధారి (రూపకం) దీక్షితర్
9-00* వాతావరణసూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30* కార్మికుల కార్యక్రమము (విజయవాడనుండి రిలే)
1-00 మహిళాసమాజం
స్త్రీల కార్యక్రమము
భక్తి గేయము
మొల్ల రామాయణం పఠనం
పెద్దక్క పెత్తనాలు
మాటా మంతీ
1-30 ఆంగ్లంలో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 హైదరాబాద్ బి వలె
2-01 కన్నడ శ్రోతలకు
2-10 ఉర్దూలో వార్తలు
2-20 శంకరరావు: సితార్
2-30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30* స్థానిక ప్రకటనలు
5-35 లలిత సంగీతం: యెంకి పాటలు ఎమ్. బాలమురళీకృష్ణ
5-50 పద్యపఠనం
6-00 ఆంగ్లంలో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు (ఉర్దూ) (హైదరాబాద్, కడపలు మాత్రమే)
6-15 ప్రాంతీయ వార్తలు
6-25 ప్రస్తుతాంశం
6-30 వ్యవసాయిక విషయాలు (విజయవాడనుండి రిలే) ధరలు, వాతావరణము
7-00 తెలుగులో వార్తలు
7-15 దీక్ష
7-25 ముఖ్య ప్రకటనలు, విరామ సంగీతం
7-30 చిత్రసీమ†
7-45 కాలచక్రం ప్రసంగం కొండా లక్ష్మణ్ బాపూజీ
7-55 విరామ సంగీతం
8-00 చీకటి తెరలు నాటిక రచన: జి. వెంకటేశ్వరరావు
8-30 సుగమ సంగీత్:
శాంతి మాథుర్
నిర్మలా మిశ్ర, ఎమ్. నయాజీ
సంధ్యా ముఖర్జీ
ఇందిరా నళినీ శుక్లా
సుజాతా చక్రవర్తి
హరీష్ భరద్వాజ్
8-50 Today in Parliament
8-55 Topic for today
9-00 ఆంగ్లంలో వార్తలు
9-15 ఉర్దూలో వార్తలు
9-30 National Programme of Talks (relay from Delhi)
9-45 శంకర రావు: సితార్
10-00 నవరస్ ఉర్దూలో కార్యక్రమము
10-30 ఆంగ్లంలో వార్తలు
10-35 వాతావరణసూచన, నేటి భావన, జనగణమన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

### కడప

333.3 మీ (900 కిలోసై)

### విశాఖపట్నం

322.6 మీ (930 కిలోసై)

సా॥ 5-30 నుండి రా॥ 9-30 వరకు

ఉ॥ ప్రసారము I

89.42 మీ (3335 కిలోసై)

[హైదరాబాద్ మాత్రమే]

6-30* హైదరాబాద్ ఎ వలె
7-45 ప్రసార సమాప్తి

ప్రసారము I (తరువాయి)

49.02 మీ (6120 కిలోసై)

8-00 హైదరాబాద్ ఎ వలె
9-00* వాతావరణసూచన, ప్రసార సమాప్తి

## విజయవాడ

357.1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-30* వందేమాతరం, శుభోదయం, ప్రసార విశేషాలు
6-40 ఆంగ్లంలో వార్తలు
6-45 భక్తిరంజని (హైదరాబాద్ నుండి రిలే)
6-55 సూక్తిముక్తావళి
7-00 తెలుగులో వార్తలు
7-15 లలిత సంగీతం (హైదరాబాద్ నుండి రిలే)
7-30 సంగీత శిక్షణ
7-45 వయొలిన్: నిలయవిద్వాంసుడు
8-00 ఆంగ్లంలో వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 హైదరాబాద్ వలె
9-00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30* కార్మికుల కార్యక్రమము
రంగస్థల సంగీతం
కార్మిక ఒడంబడిక
ప్రసంగం ఎమ్. వి. రామకృష్ణరావు
విశేషాలు, కబుర్లు

ప్రసారము II

42.02 మీ (7140 కిలోసై) (హైదరాబాద్ మాత్రమే)

12-30* హైదరాబాద్ ఎ వలె
2-00 వాతావరణసూచన
2-01 వీణ: నిలయవిద్వాంసుడు
2-30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

60.12 మీ (4990 కిలోసై)

5-30* హైదరాబాద్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు
7-15 హైదరాబాద్ ఎ వలె
9-15 Focus
9-30 హైదరాబాద్ ఎ వలె
9-45 వి. ఆర్. ధనం
10-30 హైదరాబాద్ ఎ వలె
10-35 వాతావరణసూచన, నేటి భావన, జనగణమన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-సి

245.9 మీ (1220 కిలోసై)

వివిధభారతి (రిలే)

(వివరాలు 48-వ పేజీలో)

1-00 మహిళాసమాజం (హైదరాబాద్ నుండి రిలే)
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30* స్థానిక ప్రకటనలు
5-35 లలిత సంగీతం, పద్యపఠనం (హైదరాబాద్ నుండి రిలే)
6-00 ఆంగ్లంలో వార్తలు
6-05 వాద్యబృందం
6-15 ప్రాంతీయ వార్తలు
6-25 ప్రస్తుతాంశం
6-30 వ్యవసాయిక విషయాలు
అనుబంధ పరిశ్రమలు: రైతులకు వీలగు వృత్తులు
మర్రిచెట్టుక్రింద: మారుమూల గ్రామాలలో విద్యావ్యాప్తి
ప్రకటనలు, ధరలు, వాతావరణ వివరాలు
7-00 తెలుగులో వార్తలు
7-15 దీక్ష
7-25 ముఖ్య ప్రకటనలు, విరామ సంగీతం
7-30 మేధావి కట్టమంచి రామలింగారెడ్డిగారు ప్రసంగం మరుపూరు కోదండరామిరెడ్డి
7-40 ఈ నెల పాట
7-45 లలిత సంగీతం
8-00 నాటిక (హైదరాబాద్ నుండి రిలే)
8-30 చిత్ర తరంగిణి- ఫిల్మ్ సంగీతం†
8-55 Topic for today
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 Focus: On Matters of Current Interest
9-25 విరామ సంగీతం
9-30 National programme of Talks (relay from Delhi)
9-45 అమృతవర్షిణి
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన. జనగణమన, ప్రసారసమాప్తి

## విజయవాడ—బి

200 మీ (1500 కిలోసై)

వివిధభారతి (రిలే)

(వివరాలు 48-వ పేజీలో)



* సమయసూచన  † గ్రామఫోన్ రికార్డ్  § స్టూడియో రికార్డింగ్

బుధవారం మార్చి 30

శక 1887 చైత్ర 9

## మద్రాస్-ఎ

ఉ॥ ప్రసారము I

416.7 మీ (720 కిలోసై)
ఉ॥ 6.00 నుండి 11-0 వరకు
మ॥ 12.00 నుండి 2.10 వరకు
సా॥ 5.30 రా॥ 12.00 వరకు
60.98 మీ (4920 కిలోసై)
6-30 నుండి 9-15 వరకు
41.90 మీ (7160 కిలోసై
మ॥ 12.00 నుండి 2-10 వరకు
60.98 మీ (4920 కిలోసై)
సా॥ 6-40 నుండి రా॥ 11.0 వరకు

6-00* వందేమాతరం, మంగళగానము
6-05 ఎ. ఉషా కుమారి
6-35 నేటికార్యక్రమ వివరణ, వాతావరణసూచన
6-40 ఆంగ్లంలో వార్తలు
6.45 తుదిప్పాడల్‌గళ్
6-55 అరుళ్‌వాక్కు
7.00 వాద్య సంగీతం
7-15 తమిళంలో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
7-30 సంగీతామృతం
8.00 ఆంగ్లంలో వార్తలు
8.15 శాస్త్రీయ సంగీతం
9.00 చిత్రగానం
పణంపడైత్తవన్
వానంబాడి
వేట్టైకారన్, వీరాంగనై
అక్బర్, ఆండవన్ కట్టళై
వీరపాండ్య కట్టబొమ్మన్
9-30 ఎంబార్ టి. ఎస్. వరదాచారి
10.00 ఎ. ఉషాకుమారి
10-30 మధుర గీతం
10-55 ఆంగ్లములో వార్తలు
11-00 ప్రాంతీయ శెయిదిగళ్ (193.5 మీటర్లపైగూడా)
11-05 ప్రసారసమాప్తి

మ॥ ప్రసారము II

12-00* కార్మికుల కార్యక్రమము
12-30 ఎంబార్ టి.ఎస్. వరదాచారి
1.00 పెణ్ణులగం స్త్రీలకు (తిరుచ్చినుండి రిలే)
1-30 ఆంగ్లంలో వార్తలు
1-40 వాద్య గోష్ఠి
2-00 తమిళంలో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
2.10 ప్రసారసమాప్తి

సా॥ ప్రసారము III

5-30* సి జి. మురుగేశన్ : వయొలిన్
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ శెయిదిగళ్
6.15 శెయిది కురిప్పుగళ్
6-20 గీత మంజరి
6-40 పొదునోక్కు
6-45 కణ్ణోట్టం రూపకం (తమిళం
7.00 చిత్రగానం
పణతోట్టం, పార్ మగళేపార్
సిమన్‌పెట్రసెల్వంగళ్
పయణి
7-15 తమిళంలో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
7-30 వ్యవసాయదారులకు (తిరుచ్చినుండి రిలే)
8.00 నాటిక (తమిళం (తిరుచ్చినుండి రిలే
8-15 రేడియో శెయిది మలర్ వార్తావాహిని (తమిళం
8-30 శ్రోతలు కోరినపాటలు†
9-00 ఆంగ్లంలో వార్తలు
9.15 ప్రసంగం (తమిళం)
9-30 మెల్లిశై
9.50 మైలైకపాలీశ్వరం డాక్యుమెంటరీ రూపకం (తమిళం) సమర్పణ: కె. సి. త్యాగరాజన్, కందస్వామి తురైవన్
10-30 చిత్రగానం†
చెంచులక్ష్మి, తులసీమాదం
పంచవర్ణక్కిళి
కడవుళ్లై కండేన్
నవరాత్రి, వేట్టైకారన్
కులమగళ్ రదై
11.00 మొక్కపాటి నాగేశ్వరరావు : వీణ
11.55 ఆంగ్లంలో వార్తలు
12.00 జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I

211.3 మీ (1420 కిలోసై)

6-00 మద్రాస్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
7-15 సంగీతమంజరి
7-30 మద్రాస్ ఎ వలె
8.00 ఆంగ్లములో వార్తలు
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

211.3 మీ (1420 కిలోసై)

12.00 మద్రాస్ ఎ వలె
1.00 పాశ్చాత్య సంగీతం†
1-30 ఆంగ్లంలో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణసూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

211.3 మీ 1420 (కిలోసై)
[5-30 నుండి 6.40 వరకు 60 98 మీటర్ల పైగూడా]

5-30* పాశ్చాత్య సంగీతం
6-00 ఆంగ్లంలో వార్తలు
6-05 మద్రాస్ ఎ వలె (193.5 మీటర్లపైగూడా)
6-20 వాతావరణసూచన,
స్థానిక ప్రకటనలు
వాణిజ్య వార్తలు
కార్యక్రమ వివరణ
6 40 సి జి. మురుగేశన్: వయొలిన్
7-00 తెలుగులో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
7.15 చిత్రగానం
బికారి రాముడు
వేలుతంబి దళవా
హమ్ దోనోం
7-30 గీతమాలిక
8.00 చీకటి తెరలు నాటిక (తెలుగు రచన: జి. వెంకటేశ్వరరావు
8-30 వాద్య గోష్ఠి
8-50 Today in Parliament
8-55 Topic for today
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 Focus: on Matters of Current Interest
9-30 National programme of Talks (relay from Delhi)
9-45 విరామ సంగీతం
9-50 మద్రాస్ ఎ వలె
10.30 ఆంగ్లంలో వార్తలు
10-35 వాతావరణసూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసై)
వివిధభారతి (రిలే)
(వివరాలు 48-వ పేజీలో)

## బెంగుళూరు

ఉ॥ ప్రసారం I

191.8 మీ (610 కిలోసై)

6-30* వందేమాతరం: మంగళధ్వని, సుప్రభాత విచార దీప్తి, వాతావరణసూచన
6-40 ఆంగ్లంలో వార్తలు
6-45 కార్యక్రమ వివరణ
6-50 గీతారాధన
7-15 చెంబై వైద్యనాథ భాగవతర్
7-45 కన్నడంలో వార్తలు
8.00 ఆంగ్లంలో వార్తలు
8-15 జానపదగీతి
8-30 ఎమ్. ఎస్. రత్న
8-50 ప్రసారసమాప్తి

మ॥ ప్రసారము II

12.00* కార్మికుల కార్యక్రమము
12-30 వి. ఎస్. పద్మ: వీణ వి.వి.రంగనాథన్ మృదంగం
1-10 కన్నడంలోవార్తలు
1-20 ఎమ్. ఎస్. రత్న
1-30 ఆంగ్లంలో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 ఎమ్. ఎస్. రత్న
2.00* వాతావరణసూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00 ఆంగ్లంలో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు, వాతావరణసూచన (ఆంగ్లం)
6-10 జానపద గీతి
6-20 సాహిత్య సాంస్కృతిక కార్యక్రమము (ఉర్దూ)
6-35 ప్రదేశసమాచార
6-45 వార్తా వివరణ
6.50 చిత్రగీతి†
7.00 గ్రామస్థులకు
7-45 కన్నడంలో వార్తలు
8.00 సాహిత్యద కానికె
8-15 Men and Matters
8 30 నాటిక (కన్నడం)
8-50 Today in Parliament
8-55 Topic for today
9-00 ఆంగ్లంలో వార్తలు
9.15 Portfolio of paintings: Bijapur School talk by Narayana Rao Kulakarni
9-25 వాద్య సంగీతం†
9-30 ఢిల్లీనుండి రిలే
9-45 ఆర్. పద్మ
ఎమ్. ఎస్. సుబ్రహ్మణ్యం: వయొలిన్
టి. కె. వయ్యాపురిదేవరు: మృదంగం
10-35 వాతావరణసూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## గురువారం మార్చి 31

శక 1888 చైత్ర 10

## హైదరాబాద్-ఎ

ఉ॥ ప్రసారము I

405.4 మీ (740 కిలోసై)

6.30* వందేమాతరం, సుప్రభాతం
కార్యక్రమ వివరాలు
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 భక్తిరంజని
(విజయవాడ నుండి రిలే)
6.55 సూక్తిముక్తావళి
7.00 తెలుగులో వార్తలు
7.15 ప్రాంజలి
(విజయవాడనుండి రిలే)
7.30 శ్రీరామ నీ నామం
పాటలతో కూర్చిన కార్యక్రమము
సమర్పణ: పి. విశ్వనాథం
7.45 సంగీత శిక్ష
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 సంకీర్తనం
8.30 విజయవాడ వలె
9.00* వాతావరణసూచన,
ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

10.30 శ్రీ సీతారామ కల్యాణ
మహోత్సవం
(భద్రాచలంనుండి రిలే)
12.00 ప్రసార సమాప్తి

ప్రసారము III

12.30* కార్మికుల కార్యక్రమము
కల్యాణ రాముడు రూపకం
ఉత్తరాల సంచి
గేయమాలిక†
1.00 స్త్రీలకు (ఉర్దూ)
1.30 ఆంగ్లంలో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణ సూచన
2.01 సుగమ సంగీత్
2.10 ఉర్దూలో వార్తలు
2.20 పద్మావతి గోష్ఠి‡
2.30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5.30* స్థానిక ప్రకటనలు
5.35 గ్రామలక్ష్మి
గ్రామీణ స్త్రీల కార్యక్రమము
'రాముడుద్భవించెనే' పాట
రామరాజ్యం ప్రసంగం
5.50 బాలవిహార్
రాముడు-చందమామ కథ
రామలాలి పాట
6.00 ఆంగ్లంలో వార్తలు
6.05 ప్రాంతీయ వార్తలు (ఉర్దూ)
(హైదరాబాద్, కడపలు మాత్రమే)
6.15 ప్రాంతీయ వార్తలు
6.20 ప్రస్తుతాంశం
6.30 వ్యావసాయిక విషయాలు
నాగార్జున్ సాగర్, కె. సి.
కెనాల్, కడమ్ ప్రాజెక్ట్
ఆయకట్ అభివృద్ధి
భూమి తనఖా బాంకుల పాత్ర
ప్రసంగం
కె. నరసింహస్వామి
అభ్యుదయ కర్షకుడు
సంభాషణ
ధరలు, వాతావరణము
7.00 తెలుగులో వార్తలు
7.15 దీక్ష
7.25 ముఖ్య ప్రకటనలు,
విరామసంగీతం
7.30 చతురంగం
(విజయవాడనుండి రిలే)
7.45 రాగం, తానం, పల్లవి:
ఎస్. ఎస్. శ్రీనివాసన్: వేణువు
8.30 Radio News Reel
(relay from Delhi)
8.40 Air force Day
message by
The Chief of Air staff
(relay from Delhi)
8.55 Topic for today
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 ఉర్దూలో వార్తలు
9.30 ఆధ్యాత్మ రామాయణం
బాలకాండం
సంగీత రూపకం
(విజయవాడనుండి రిలే)
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 వాతావరణ సూచన,
నేటి భావన,
జనగణమన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

### కడప

333.3 మీ (900 కిలోసై)

### విశాఖపట్నం

322.6 మీ (930 కిలోసై)

సా॥ 5.30 నుండి రా॥ 9.30 వరకు

ఉ॥ ప్రసారము I

89.42 మీ (3355 కిలోసై)
(హైదరాబాద్ మాత్రమే)

6.30* హైదరాబాద్ ఎ వలె
7.45 ప్రసార సమాప్తి

ప్రసారం I (తరువాయి)

49.02 మీ (6120 కిలోసై)

8.00 హైదరాబాద్ ఎ వలె
9.00* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

## విజయవాడ

357.1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6.30* వందేమాతరం, శుభోదయం,
ప్రసార విశేషాలు
6.40 ఆంగ్లంలో వార్తలు
6.45 భక్తిరంజని:
బదరీనారాయణ సుప్రభాతం
6.55 సూక్తి ముక్తావళి
7.00 తెలుగులో వార్తలు
7.15 ప్రాంజలి
7.30 సంగీత శిక్షణ
7.45 రామదాసు కీర్తనలు
8.00 ఆంగ్లంలో వార్తలు
8.15 హిందీలో వార్తలు
8.30 ఎస్. తంగయ్యా: నాదస్వరం
9.00* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

10.30 భద్రాచల సీతారామ
కల్యాణ మహోత్సవంపై
ప్రత్యక్ష సమీక్ష
సమీక్షకులు: కప్పగంతుల
లక్ష్మణ శాస్త్రి

ప్రసారము II

42.02 మీ (7140 కిలోసై)
(హైదరాబాద్ మాత్రమే)

10.30 హైదరాబాద్ ఎ వలె
12.00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము III

12.30* హైదరాబాద్ ఎ వలె
1.00 ఎమ్. సీతారామానుజాచారి
1.30 హైదరాబాద్ ఎ వలె
2.10 వాద్య గోష్ఠి:
నిలయవిద్వాంసులు
2.30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

60.12 మీ (4990 కిలోసై)

5.30* హైదరాబాద్ ఎ వలె
7.00 తెలుగులో వార్తలు
7.15 హైదరాబాద్ ఎ వలె
8.30 సుబుద్ధ సంగీతం:
కమలా కైలాసనాథన్:
కె. వి. నారాయణస్వామి
టి. వి. రత్నం
8.55 హైదరాబాద్ ఎ వలె
9.15 Focus
9.30 హైదరాబాద్ ఎ వలె
10.35 వాతావరణ సూచన,
నేటి భావన,
జనగణమన, ప్రసారసమాప్తి

## హైదరాబాద్-సి

245.9 మీ (1220 కిలోసై)
వివిధభారతి (రిలే)
(వివరాలు 48-వ పేజీలో)

12.30 కార్మికుల కార్యక్రమము
(హైదరాబాద్‌నుండి రిలే)
1.00 ఎస్. తంగయ్యా: నాదస్వరం
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణ సూచన,
ప్రసారసమాప్తి

సా॥ ప్రసారము III

5.30* స్థానిక ప్రకటనలు
5.35 గ్రామలక్ష్మి, బాలవిహార్
(హైదరాబాద్‌నుండి రిలే)
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 వాద్య బృందం
6.15 ప్రాంతీయ వార్తలు
6.25 ప్రస్తుతాంశం
(హైదరాబాద్‌నుండి రిలే)
6.30 వ్యావసాయిక విషయాలు
(హైదరాబాద్‌నుండి రిలే)
7.00 తెలుగులో వార్తలు
7.15 దీక్ష
7.25 ముఖ్యప్రకటనలు,
విరామ సంగీతం
7.30 చతురంగం రూపకం
7.45 రాగం, తానం, పల్లవి
(హైదరాబాద్‌నుండి రిలే)
8.30 Radio News Reel
(relay from Delhi)
8.40 చిత్రతరంగిణి-
ఫిల్మ్ సంగీతం†
8.55 Topic for today
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 Focus: On Matters of
Current Interest
9.30 ఆధ్యాత్మ రామాయణం-
బాలకాండం
సంగీత రూపకం
(ఆధ్యాత్మ రామాయణ
కీర్తనలతో కూర్పు)
సంప్రదాయ సంగీతం:
జొన్నలగడ్డ శివశంకర శాస్త్రి
సమర్పణ: వోలేటి వెంకటేశ్వర్లు
10.15 ఉత్సవ సంప్రదాయ
కీర్తనలు, దివ్యనామ కీర్తనలు
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 వాతావరణ సూచన,
జనగణమన, ప్రసార సమాప్తి

## విజయవాడ-బి

200 మీ (1500 కిలోసై)
వివిధభారతి (రిలే)
(వివరాలు 48-వ పేజీలో)



* సమయసూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

గురువారం మార్చి 31

శక 1888 చైత్ర 10

## మద్రాస్-ఎ

ఉ॥ ప్రసారము I

416.7 మీ (720 కిలోసైౖ)
ఉ॥ 6.00 నుండి 11.05 వరకు
మ॥ 12.00 నుండి 2.10 వరకు
సా॥ 5.30 నుండి రా॥ 12.00 వరకు
60.98 మీ (4920 కిలోసై)
ఉ॥ 6.30 నుండి 9.15 వరకు
41.90 మీ (7160 కిలోసై)
మ॥ 12.00 నుండి సా॥ 2.10 వరకు
60.98 మీ (4920 కిలోసై)
సా॥ 6.40 నుండి రా॥ 11.00 వరకు

6.00* వందేమాతరం, మంగళ గానం
6.05 వి. సోమేశ్వరన్
6.35 నేటి కార్యక్రమ వివరణ, వాతావరణసూచన
6.40 అంగ్లంలో వార్తలు
6.45 తుదిప్పాడల్‌గళ్
6.55 అరుళ్ వాక్కు
7.00 వాద్య సంగీతం
7.15 తమిళములో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
7.30 'రామసౌందర్యం' సంగీత రూపకం సమర్పణ: కె. సి. త్యాగరాజన్
8.00 అంగ్లంలో వార్తలు
8.15 రాగం, తానం, పల్లవి: వి. సేతురామయ్య: వయొలిన్ మద్రాస్ ఎ. కణ్ణన్: మృదంగం కె. నారాయణస్వామి: ఘటం
9.00 ప్రసంగం (తమిళం)
9.15 విజయలక్ష్మి జ్ఞానస్కందన్
10.00 వి. సోమేశ్వరన్
10.30 మధురగీతం
10.55 అంగ్లములో వార్తలు
11.00 ప్రాంతీయ శెయిదిగళ్ (193.5 మీటర్లపైగూడా)
11.05 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12.00* కార్మికుల కార్యక్రమము
12.30 సి. ఎస్. సరోజిని
1.00 ఎ. వి. బాలసుబ్రహ్మణ్యం
1.30 అంగ్లంలో వార్తలు
1.40 వాద్య గోష్ఠి
2.00 తమిళములో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
2.10 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5.30* సి. ఎస్. సరోజిని
6.00 అంగ్లములో వార్తలు
6.05 ప్రాంతీయ శెయిదిగళ్
6.15 శెయిది కురిప్పుగళ్
6.20 మధురగీతం
6.40 పాదునోక్కు
6.45 మున్నేట్ర పాదై రూపకం (తిరుచ్చినుండి రిలే)
7.00 చిత్రగానం లవకుశ భక్త రావణ భక్త శబరి
7.15 తమిళములో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
7.30 వ్యవసాయదారులకు (తిరుచ్చినుండి రిలే)
8.00 బాల రామాయణం వన్య నాటిక I వ భాగం రచన: రేడియో అణ్ణా సంగీతం: మల్లిక్ పఠన: కా. జయశ్రీ
9.00 అంగ్లములో వార్తలు
9.15 పుస్తక సమీక్ష (తమిళం)
9.30 శివలూర్ మీనాక్షిసుందరం పిళ్లై
10.30 చిత్రగానం† లవకుశ సంపూర్ణ రామాయణం రామ రాజ్యం
11.00 పాశ్చాత్య సంగీతం
11.55 అంగ్లములో వార్తలు
12.00 జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I

211.3 మీ (1420 కిలోసై)

6.00 మద్రాస్ ఎ వలె
7.00 తెలుగులో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
7.15 సంగీతమంజరి
7.30 మద్రాస్ ఎ వలె
8.00 అంగ్లములో వార్తలు
8.15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II
211.3 మీ (1420 కిలోసై)

12.00 మద్రాస్ ఎ వలె
1.00 పాశ్చాత్య సంగీతం†
1.30 అంగ్లములో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 తెలుగులో వార్తలు
2.00 మహిళామండలి స్త్రీల కార్యక్రమము పంచవర్ష ప్రణాళిక-విద్య ప్రసంగం పి. శిరోమణి శ్రోతల లేఖలు మంగళం
2.30 వాతావరణసూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

211.3 మీ (1420 కిలోసై)
(5.30 నుండి 6.40 వరకు 60.98 మీటర్లపైగూడా)

5.30* పాశ్చాత్య సంగీతం
6.00 అంగ్లములో వార్తలు
6.05 మద్రాస్ ఎ వలె (193.5 మీటర్లపైగూడా)
6.20 వాతావరణసూచన స్థానిక ప్రకటనలు వాణిజ్య వార్తలు కార్యక్రమ వివరణ
6.40 ఎ. వి. బాలసుబ్రహ్మణ్యం
7.00 తెలుగులో వార్తలు (193.5 మీటర్లపైగూడా)
7.15 వాద్య సంగీతం
7.30 గీతమాలిక
8.00 U. N. Speaks
8.10 విరామ సంగీతం
8.15 అంజలి
8.30 Radio News Reel (relay from Delhi)
8.40 Air Force Day- Message by Chief of Air Staff- Air Marshal Arjun Singh (relay from Delhi)
8.55 Topic for today
9.00 అంగ్లములో వార్తలు
9.15 Focus: on matters of Current interest
9.30 కొత్తగూడెం విద్యుదుత్పాదక కేంద్రం రూపకం (తెలుగు)
10.30 అంగ్లంలో వార్తలు
10.35 వాతావరణసూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసై)
వివిధభారతి (రిలే)
[వివరాలు 48.వ పేజీలో]

## బెంగుళూరు

491.8 మీ (610 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6.30 వందేమాతరం, మంగళధ్వని సుప్రభాతం, విచారదీప్తి వాతావరణసూచన
6.40 అంగ్లంలో వార్తలు
6.45 కార్యక్రమ వివరణ
6.50 శివారాధన
7.15 నామగిరిపేట్టై కృష్ణన్: నాదస్వరం
7.45 కన్నడములో వార్తలు
8.00 అంగ్లములో వార్తలు
8.15 మధురమణి అయ్యర్ టి. ఎస్. వేంబు అయ్యర్
9.15 బజారు ధరలు
9.25 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12.00* కార్మికుల కార్యక్రమము
12.30 వనితావిహార
1.00 సుగమసంగీత†
1.10 కన్నడములో వార్తలు
1.20 కన్నడ గీతావళి†
1.30 అంగ్లములో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 కావ్యవచన
2.00* వాతావరణసూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6.00 అంగ్లంలో వార్తలు
6.05 ప్రాంతీయ వార్తలు, వాతావరణసూచన (అంగ్లం)
6.10 గానామృత†
6.20 కావ్యవాచన
6.35 ప్రదేశసమాచార
6.45 వార్తావివరణ
6.50 గీతాంజలి: నిలయవిద్వాంసులు
7.00 గ్రామస్థులకు
7.45 కన్నడములో వార్తలు
8.00 సమాచార సమీక్ష
8.10 మిశ్రమాధుర్య†
8.30 ఢిల్లీనుండి రిలే
8.40 ఢిల్లీనుండి రిలే
8.50 వాద్యశ్రీ†
8.55 Topic for today
9.00 అంగ్లంలో వార్తలు
9.15 Focus: on Matters of Current Interest
9.30 నాటిక (కన్నడం)
10.30 అంగ్లములో వార్తలు
10.35 వాతావరణసూచన, జనగణమన, ప్రసారసమాప్తి

## ప్రసార విశేషాలు

### సింహగిరి [నాటిక]

రచన:

డా॥ పాకాల వెంకటరాజమన్నారు

సింహగిరి దుర్గం (సిగిరియా) సింహళ ద్వీపంలో సుప్రసిద్ధ దుర్గం. దీన్ని కశ్యప మహారాజు నిర్మించాడు. ప్రాచీన సింహళ రాజవంశాల చరిత్రను తెలియజేసే "మహావంశం" అనే గ్రంథంలో కశ్యపుని గాథ ఉంది. ఈ రాజు క్రీ॥ శ॥ ఆయిదవ శతాబ్దానికి చెందినవాడు.

ధతుసేన మహారాజుకు ఇద్దరు కుమారులు. మొదటివాడు మౌద్గల్యుడు. ఇతడు మహారాణికి జన్మించినవాడు. రెండవ వాడు కశ్యపుడు. ఇతడు తక్కువ జాతికి చెందిన మరొక భార్యకు కలిగినవాడు. కశ్యపుడు తన తండ్రిని చంపి రాజ్యాన్ని అపహరిస్తాడు. అసలు వారసుడైన మౌద్గల్యుడు తనకు కావలసిన సైన్య సహాయం తెచ్చుకోడానికి వెళతాడు. అతను తిరిగి వచ్చేలోగా కశ్యపుడు శత్రు నిర్భేద్యమైన సింహగిరిదుర్గం నిర్మిస్తాడు. అధికార గర్వంతో, ధన మదాంధతతో తనను తాను కుబేరుడుగా భావిస్తాడు.

ఈ పరిస్థితుల్లో మౌద్గల్యుడు తిరిగి వస్తాడు. కశ్యపుడికీ ఇతనికీ ఘోర యుద్ధం జరుగుతుంది. కశ్యపుని పొరపాటువల్ల అతని సేన చెల్లాచెదరై పోతుంది. మౌద్గల్యుడు జయిస్తాడు. కశ్యపుడు ఆత్మహత్య చేసుకుంటాడు. స్వార్థపరుని ఉన్నతినీ, పతనాన్నీ చిత్రించే నాటిక యిది.

ఈ నాటిక మార్చి 21వ తేదీ రాత్రి 9.30 గంటలకి మద్రాస్ కేంద్రం నుంచి ప్రసారమవుతుంది. హైదరాబాదు, విజయవాడ కేంద్రాలు రిలే చేస్తాయి.

### సంస్కృత కావ్యాలలో వసంతం

వసంతం వస్తూందంటేనే జగత్తు పులకిస్తుంది. కొత్త శోభకో, నవనవ సందేశాలతో, నవ్యతారుణ్యంతో జగత్తు వసంత మాధుర్యంతో నిండుతుంది. భారతీయ కవులలో వ్యాస వాల్మీకులు, కాళిదాస మాఘులు మొదలయినవారు, తమ తమ అత్యద్భుత కవితామాధుర్యంతో వసంత ఋతు మాధుర్య దీప్తిని మనకు మరింత సన్నిహితం చేశారు. ఈ ప్రసంగం (అమరవాణి) ఆ ఆ మహాకవుల వసంత గానాన్ని వ్యాఖ్యానించి వివరిస్తుంది. ఈ కార్యక్రమాన్ని మార్చి 20వ తేదీ ఆదివారం ఉదయం 7.30 గంటలకు ఆకాశవాణి విజయవాడ కేంద్రమునుండి ప్రసారమవుతుంది. ఈ కార్యక్రమమును హైదరాబాదు కేంద్రంనుంచి కూడా వినవచ్చును.

సమర్పణ,

జమ్మలమడక(?) రుక్మిణీనాథ శాస్త్రి

### "ఉగాది బొమ్మరిల్లు"

"పూవు పుట్టగానే పరిమళిస్తుంది" అలాగే మహాపురుషుల మహనీయ గుణ సంపద వారి చిన్ననాడే వన్నెలీనుతుంది. ఈ విశేషాన్ని వివరించే-కొందరు ఆంధ్ర మహాపురుషుల చిన్ననాటి జీవిత ఘట్టాలను చిత్రించే ప్రత్యేక రూపక కార్యక్రమం ఆకాశవాణి విజయవాడ కేంద్రంనుండి 23-3-66 తేదీ బుధవారం మధ్యాహ్నం 2 గంటలకు వెలువడే "ఉగాది బొమ్మరిల్లు"లో ప్రసారమవుతుంది

సమర్పణ: ఏడిద కామేశ్వరరావు.

---

**విజయవాడ బి**

300 మీ (1500 కిలో సై

వివిధభారతి (రిలే)

ప్రసారము I ఉ॥ 7.00 నుండి 9.30

,, II 10 15 నుండి 12.30

,, III ,, 2.00 నుండి 5.30

,, IV సా॥ 6.30 నుండి రా॥ 10.40 వరకు

[శనివారం మాత్రం IV ప్రసారము రాత్రి 11.00 గంటల వరకు]

[వివరాలు 48-వ పేజీలో]

---

## రవి చంద్ర

(5వ పేజీ తరువాయి)

వాయించుకున్నప్పుడే మీ నాన్నగారు మా యింటిమీదికొచ్చి పోట్లాడి వెళ్ళారు. చేస్తే చేసుకోండి. మానేస్తే మానేసుకోండి. నెలకు పదిహేను రూపాయలిచ్చిచెప్పించుకుంటున్నాను. ప్రాక్టీసు చేసుకోకపోతే నేర్చుకుని ఏం ప్రయోజనం? అంటూ కోపంగా వెళ్ళిపోయింది సుజాత.

సుజాత వెళ్ళిపోయాక మురళి ఆ అమ్మాయికి అంత కోపం తెప్పించకుండా ఉండాల్సింది అనుకుని విచారించాడు.

చిదంబరావుగారికి ఇంత అందమైన అమ్మాయి ఎలా పుట్టిందో అని ఆలోచిస్తూ ఆ రాత్రి చాలాసేపటి వరకు నిద్రపోలేదు మురళి.

* * *

కల్పన హాస్టల్‌కు వెళ్ళాలంటే వేళాపాళా చూసుకుని మరీ వెళ్లాలి. ఏరోజు పడితే ఆరోజు వెళ్ళడానికి వీల్లేదు. అలాగని ఆరోజుల్లో తనకు వీలుండొద్దూ? అందుకనే రవి, కల్పనతో ఒక ఒప్పందం చేసుకున్నాడు.

కల్పన గదికి ఎదురుగా ఒక సందు ఉన్నది. ఆ సందులో నిలబడి తను మౌత్ ఆర్గన్ వాయిస్తాడు. మౌత్ ఆర్గన్ వినిపించిన వెంటనే కల్పన ఇవతలకు రావాలి. యీ విధంగా యిద్దరూ రెండు మూడుసార్లు కనుసుకున్నారు.

ఒకరోజు......

మౌత్ ఆర్గన్ పిలుస్తున్నది. వార్డెన్ కల్పన గదిదగ్గరే తచ్చాడుతున్నది వార్డెన్‌కు తనమీద అనుమానంగా ఉన్నట్టుంది. బైటికి వెళ్తే కోరి తద్దినం తెచ్చుకోవటమే అవుతుంది. అందుకని కల్పన కదలకుండా గదిలోనే ఉండిపోయింది.

కాస్సేపటికి మౌత్ ఆర్గన్ వినబడటం మానేసింది. కల్పన నిస్పృహాయంగా నిట్టూర్చింది. అన్నయ్య తనను తిట్టుకుంటూ వెళ్లిపోయి ఉంటాడు అనుకుంది బాధగా. రవి వెళ్లిపోయినమాట నిజమేగాని వార్డెన్‌తో గొడవ రాకుండా మాత్రం ఆరోజు గడవలేదు. మౌత్ ఆర్గన్ వినబడిన వెంటనే వార్డెన్ ఒడీసప్పుడు చేయకుండా వీధిలోకి వెళ్లింది కల్పన తనకన్నుకప్పాలనుకుంటున్నది. ఎంత



"అంతా, చేదు నాకే కావాలి"

చిత్రకారిణి: శ్రీమతి వి. ప్రేమ

పిచ్చిపిల్ల. రవి తన చేరువలోకి వస్తున్న వార్డెనమ్మను చూసి కంగారెత్తిపోయాడు. వెంట తీసుకొచ్చిన ఊర్వశిని అరుగుమీదికి ఉసికొల్పి హాట్ అర్గన్ జేబులో వేసుకొని వెనక్కి తిరిగి చూడకుండా ఉడాయించాడు రవి.

ఊర్వశి భౌ భౌ మని అరుస్తూ మీదమీదకు రావటంచూసి వార్డెన్ ముచ్చెమటలు కక్కుకుంటూ కాలికి బుద్ధిచెప్పింది. ఊర్వశికూడా వేగం హెచ్చించి అండ వెనకాల పరిగెత్తింది. ఎలాగో హాస్టల్లోకి ప్రవేశించి గేటు తలుపులు మూసేసి గదివరకు రొప్పుకుంటూ రోజుకుంటూ పరుగులు తీసింది వార్డెన్. గేటు అవతల నిలబడి భౌ భౌ మని కాస్సేపు అరిచి తన దారిని తను వెళ్లిపోయింది ఊర్వశి. స్థూలకాయాన్ని వూగించుకుంటూ వికృతంగా పరుగులుతీస్తున్న వార్డెనమ్మనుచూసి అమ్మాయిలకు నవ్వు ఆశ్చర్యం ఒకేసారి వేశాయి— వార్డెనమ్మకు మతిగాని పోలేదుకదా?— అని ముక్కుమీద వేలేసుకుంది రాఘవమ్మ.

* * *

స్వాతంత్ర్య దినోత్సవంనాడు ఖుషీగా గడిపి మర్నాడు అంతా బద్ధకంగా ఆఫీసుకెళ్ళారు. మురళి ఇలా ఆఫీసులోకి అడుగుబెట్టాడో లేదో ఆఫీసరు రయ్‌మని ఆ గదిలోకి దూసుకొచ్చాడు. ఆఫీసరుగారు యీరోజు ఇంతవేగంగా వచ్చారేం చెప్మా అని మురళి ఆలోచనలో పడబోయేసరికి ఆయన సింహంలా గర్జించాడు.

అంతా ఒకమాటుపైకిరండి. అని ఆజ్ఞాపించి చర్రున పైకి వెళిపోయారు ఆఫీసరుగారు. కిక్కురుమనకుండా అంతా మేడమెట్లెక్కి పైకి వెళ్ళారు. ఆఫీసరుగారు జెండా వంక చేయెత్తి చూపిస్తూ.... ఇందులో తప్పేమిటి? అన్నారు భూమ్యాకాశాలు దద్దరిల్లిపోయేటంత పెద్ద గొంతుకతో.

అంతా స్థాణువుల్లా నిలబడిపోయారు. ఆఫీసరుగారు గట్టిగా హూంకరించి చేతిలో ఉన్న దినపత్రికని తీసి [illegible] చదివారు— [illegible]

హేమీ కంపెనీ కార్యాలయంమీద జెండాను తిరగేసి ఎగరేశారు.

అందరి దృష్టి అనుకోకుండా జెండాపైకిపోయింది. అడుగున వంగ పండు. మీద ఆకుపచ్చతో వెక్కిరిస్తున్నట్టుగా ఉన్నది. అందరికీ నవ్వొచ్చింది. అతిప్రయాసమీద ఆపుకున్నారు నవ్వాల్సిన తరుణం కాదు కాబట్టి.

అయినాఆఫీసరుగారు అసాధ్యులు. అందరి నవ్వుముఖాలను ఆయన యిట్టే పసికట్టి— సిగ్గులేకపోతే సరి, నవ్వటానికి, చేసిన పనికి తలలు వంచుకో వాల్సిం ది పో యి. మన జెండాకు ఎంత ఒవమానం. ఎంత అగౌరవం. మన ఆఫీసుకెంత అప్రతిష్ట ఇంతకీ జెండా ఎవరు కట్టారు? అనడిగారు కోపంగా,

ఎవరో మెల్లిగా— అప్పన్న— అని సమాధానం యిచ్చారు.

అయితే అప్పన్నదే తప్పంటారా? మీరంతా ఏమయ్యారు? వాడు కడితే తప్పో రైటో ఎవడో ఒకడువచ్చి చూసుకోవద్దూ? అసలు మీకొకటి తెలిసేదిస్తేగా జెండాకు ఏరంగు ఎక్కడో? రోజుకో పదిమాట్లు ఇంపోజిషన్ రాసి తీసుకొచ్చి నాకు చూపిస్తూ ఉండాలి, దానికితోడు మీ అందరికీ తలో రూపాయి. ఎలా కట్టాలో అడిగి తెలుసుకోకుండా పెత్తనం చెలాయించినందుకు అప్పన్నకో రూపాయి జరిమానా వేస్తున్నాను. ఇంక వెళ్లి పనిసంగతి చూడండి.

ఆఫీసరుగారు అప్పన్నవైపు తిరిగి- జెండా తీసేసి లోపల దాచిపెట్టు-అని కోపంగా ఆదేశించి మెట్లుదిగి తన గదిలోకి వెళ్లిపోయారు.

అంతా ఎవరి సీట్లకు వాళ్లు వెళ్లి దిగులుగా కూర్చున్నారు. కొంతమంది అప్పన్నమీద విరుచుకుపడ్డారు-నీకు తెలీకపోతే ఎవరినైనా అడగలేక పోయావా అప్పనా? నీనుంచి చూడు ఎన్ని తిప్పలొచ్చాయో?

అప్పన్న అంతకన్నా గట్టిగా నోరెట్టుకుని పడ్డాడు.—ఆ కాడకి నాకెందుకు సెప్పినారు? మీరే ఎగరేసుకోనేక పోయారా?

ఆఫీసరుగారికి యీ గొడవ ఎక్కడ వినబడుతుందోనని హడలుకుని అంతా నోరు మూసుకుని పనిచేసుకోవటం ప్రారంభించారు.

కాస్తదూరంలో దీనంగా దిక్కులు చూస్తూ కూర్చున్న అప్పన్ననుచూసి మురళి-ఇంతకీ ఆ సంపాదకుడివి దేగకళ్లు అప్పన్నా-అన్నాడు.

అప్పన్న ఆశ్చర్యంగా చూస్తూ-వోరు బాబూ?-అనడిగాడు,

ఇంకెవరు? ఆ చిదంబరరావుగారు లేరూ? ఆయనే. జెండా తిరగేసి కట్టడం పొరపాటే అనుకో, అందుకని పేపర్లో ఎక్కించి మనకిన్ని కష్టాలు తెచ్చి పెడ్తాడా?-అంటూ విసుక్కున్నాడు మురళి.

ఆ బాబుని ఏదో కాపి చిత్తుగా తన్నాలి. నేకపోతే మరీ వెర్రి రేగిపోతున్నాడు-అప్పన్న తన కసినంతా వెళ్లగక్కాడు.

చిదంబరరావుగారు తన్నులతింటే తనకొచ్చే నష్టమేమీ లేదుకాని, సుజాతకు బాధ కలిగించాలంటే కష్టమేసింది.

ఆ పని చెయ్యకు అప్పన్నా, ఆయన పోలీసులకు చెప్పి నిన్ను జైల్లో పెట్టిస్తాడు. అప్పుడింక కటకటలాడుతూ కటకటాల వెనకే ఉండాలి-అని బెదిరించాడు మురళి,

అప్పన్న నిజంగానే హడలుతున్నాడు.

బగమంతుడే ఆ బాబుకి తగిన సిచ్చ ఏస్తాడులెండిబాబూ . అంటూ సన్నగా గొణిగాడు అప్పన్న.

* * *

దృఢంగా మోటుగా కనబడుతున్న ఒక పల్లెటూరి మనిషి చేతిసంచితో సరాసరి పూరినించి హాస్టల్కు పరిగెత్తుకొచ్చాడు, వార్డెన్ వ్రాసిన ఉత్తరం చూసుకుని.

సాయంత్రం అయిదు దాటగానే ఇక్కడకు రండి, వచ్చేటప్పుడు మీతోపాటు ఓ మోత్ ఆర్గన్కూడా తీసుకురండి-అని ఆదేశించింది వార్డెన్. పల్లెటూరతను వార్డెన్ వద్ద సెలవు తీసుకుని పశుపతిగారింటికి బయల్దేరాడు.

పశుపతి బాగా డబ్బున్నవాడు. ప్లీడరీ వృత్తితో రాబడి రాకపోయినా ఆయనకు చింతలేదు. ఆయనకు ఒకే కొడుకు, ఒకే కూతురు. కొడుకు రాజుకు ఫోటోగ్రఫీ అంటే వెర్రి. కూతురు లావణ్యకు ఇంకా పెళ్లి కాలేదు. లావణ్య పూర్తి పేరు ఏం. పుష్పలావణ్య.

పుష్పలావణ్య అంటే మోటుగా ఉందని ఆవిడ ఎం. పి. లావణ్య అని మార్చేసుకుంది. అప్పటినుంచీ లావణ్య అందరికీ ఎం. పి. లావణ్యగానే తెలుసు లావణ్యచేతి కమ్మని వంట తిని రామయ్యగారు గుర్రుపెట్టి నిద్రపోయారు. నాల్గింటికల్లా లేచి కాఫీ ఫలహారం తీసుకుని రవి గది కెళ్లారు. కల్పనకు ఏదో ఇంజనీరు సంబంధం చూస్తున్నట్టు వ్రాశారు. ఆ సందర్భంలోనే నాన్న యిలా హటాత్తుగా వచ్చివుంటాడు అనుకున్నాడు రవి. కల్పనకు చదువు పూర్తికాకుండా పెళ్లి చేసుకోవాలని లేదు. నాన్నకు మెల్లిగా నచ్చచెప్పాలి.

[సశేషం]



చిత్రకారుడు: మారేమండ శ్రీనివాసరావు

## కావ్యానుభూతి

[2.వ పేజీ తరువాయి]

అధ్యవసాయ ఉత్ప్రేక్షా స్వప్నమాయా ఇంద్రజాలాది విలక్షణమనీ. పాఠకునకు కలుగుతున్న అనుభవం సమ్యక్ జ్ఞానభ్రాంతి సంశయ అనవధారణ అనధ్యవసాయ విజ్ఞానభిన్న వృత్తాంతాస్వాదన రూపసంవేదనమనీ అన్నారు.

ఇలాంటి అనుభవమే కాక రామాయణం, భారతం షేక్స్పియర్ నాటకాలవంటి రచనలు మరికొంత విశేషానుభవం కలిగిస్తున్నవి. వాటిని పూరిగా చదివేటప్పటికి పాఠకుడు ఆయా పాత్రలందు తన్మయీభావ స్థానీయావస్థ పొందటమే కాక విషయ రహితమైన స్థితి పొందుతున్నాడు ఆ స్థితి ఆర్య నాగార్జునుడు పేర్కొన్నట్లు చతుష్కోటి—సదసదుభయానుభయాంతాలు—వినిర్ముక్తం. అందు ఏ దృష్టి ఉండదు. అదే నిర్వాణం. అట్టి స్థితి కేవలం కరుణం వల్లనో శాంతం వల్లనో మాత్రమే ప్రాప్యమేమో ననిపిస్తున్నది. కనుకనే కరుణం ఒక్కటే రసమని భవభూతి, శాంతమే మహా రసమని అభినవగుప్తుడు పేర్కొన్నారు వీరిరువుర కంటె అత్యంత ప్రాచీనుడైనా నాగార్జునుడు కావ్యతత్త్వాన్ని ప్రత్యక్షంగాగాని పరోక్షంగాగాని ప్రస్తావించకపోయినా సర్వోపశమాన్ని ఉపదేశించటంవల్ల అతని మతంలో శాంతమే రసరాట్టని చెప్పుకోవచ్చును. కావ్యంవల్ల పొందబడుతున్న యీ స్థితి సుషుప్తి అపస్మారం, మదిరాపాన వైవశ్యం మున్నైన వాటికంటె ఎలా విశిష్టమని అనిపించవచ్చును. సుషుప్త్యవస్థలలో పంచేంద్రియ వ్యాపారం ప్రవర్తిల్లదు, కావ్యాస్వాదనకాలంలో జ్ఞానేంద్రియాలు జాగరూకాలై ఉంట చక్షురక్షర సంయోగాదులు సాగుతుంటవి. అనౌచిత్యం, అసంభావ్యత పొడకట్టగానే మనసు ఎదురు తిరిగి బాహ్య జగత్తులో వచ్చిపడుతుంది కనుక కావ్యానుభూతికి. సుషుప్త్యాదులకూ పోలిక లేదు.

ఇంతకూ ఇలాంటి కావ్యానుభవం దేనికి కూడు పెడుతుందా? గుడ్డ ఇస్తుందా? జాతిని వీర్యవంతం చేస్తుదా?

కావ్యానుభూతి అలౌకికం. ఇలాంటి అనుభవం శాస్త్రాలవల్లగాని ఇక్షురసాస్వాదనవంటి భౌతికభోగాలవల్లగాని లభించదు, ఈ అనుభవం అనన్యం. శాస్త్రాదులు అసంవృత్తిని అమోదిస్తవి. కాని ఆ అసంవృత్తి స్వరూపం అవి బోధపరచలేవు. కావ్యం అలా కాక పాఠకుణ్ణి మూర్త ప్రపంచంనుంచి అమూర్త ప్రపంచానికీ ఆ అమూర్త ప్రపంచంనుంచి అసంవృతికీ చేరవేస్తుంది. అలా చేరవేయబడుతున్నప్పుడు పాఠకుడు పొందే ఆనందం ఇష్టార్థప్రాప్తివల్ల కలుగదు, విమానంలో ఎక్కి తిరిగితే రాదు. చంద్రమండలంలో మొదటిసారిగా అడుగు మోపినా పొడమదు సహృదయుడు పొందే ఆ అనుభవం అనుభవైకవేద్యం.

భోజ్యపదార్థాలకు ఉప్పు రుచి కల్పిస్తున్నట్టే మానవ జీవితానికి లలిత కళలే అర్థం విలువ కల్పిస్తున్నవి. కసాయి వృత్తియందు సాధారణంగా మనకు జుగుప్స కలుగుతుంది. ఆ కసాయి వృత్తి పాటించిన ధర్మవ్యాధునికి లోకపూజ్యత సంప్రాప్తిం



'కాల కన్య' నాటికలో పాల్గొన్న నటీనట వర్గం (ఇటీవల విజయవాడనుండి ప్రసారితము)

చింది. వ్యాసభారతికి లేకపోతే అది సాధ్యపడేదా? అలాగే దొంగలను, దొంగతనాన్ని మనం క్షమించము దాస్తవస్కీ- ఆనెస్టతీఫ్ అన్న కథవ్రాసి ఆ వశ్యతోహరుడికి మనచేత అశ్రు తర్పణం విడిపించాడు. లేడీ మాక్బెత్ అన్న కథలో వరొక రష్యన్ రచయిత దారుణబంధకిపై మన కరుణా వృష్టి కురిపించాడు. మనదేశంలోని సామాన్య ప్రజానీకాని కున్న విలువ లన్నీ భారత రామాయణాలవల్ల కలిగినవే. శాస్త్రం వస్తువుల ప్రయోజనం నిర్ణయిస్తే కవిత్వాది లలితకళలు వాటికి విలువలను కల్పించి వ్యవస్థీకరిస్తున్నవి.

కావ్యం పాఠకునకు తన్మయీభావం కలిగిస్తున్నది. కనుక అది అతని సంకుచిత దృష్టిని పటాపంచలుచేసి మనోవైశద్యం కల్పించి పశుత్వం దగ్గరనుంచి పశుపతిత్వం దాక సానుభూతితో గ్రహింపజేస్తున్నది. తన మూల సిద్ధాంతాలకు విరుద్ధాలైనప్పుడు ప్రియురాలి యుపదేశాలనైనా పాఠకుడు ప్రియతర వచనాలతో తప్పుకొనిపోవచ్చును. కాని కావ్యమం దట్లుగాదు. కావ్యార్థమే హృదయమై పోతుంది. నాగార్జునుని పరిభాషలో చెప్పవలసివస్తే సంసారానికి మూలభూతమైన దృష్టి సమూలం నశించక పోయినా శిథిలమవుతుంది. ఈ ప్రమాదం గుర్తించి ప్లేటో తన దృష్టి కనుగుణంగా వ్రాయని కవులను తన ఆదర్శరాజ్యం నుంచి బహిష్కరిస్తా నన్నాడు. మన అదృష్టం బాగుండి అతనికి ఆ అధికారం సంక్రమించ లేదు. నియంతృత రాజ్యాధినేతలు లలితకళలకున్న యీ శక్తిని గుర్తించి వాటిని అనుశాసిస్తున్నారు. దీనివలన లలిత కళాఖండాలు లోపించి వాటి ఆభాసాలుమాత్రమే అచటి ప్రజలకు లభిస్తున్నవి.

పురుషార్థాల పార్యంతికఫలం ఆనందమే కదా. ఆ ఆనందాన్ని సాహిత్యం అప్పటికప్పుడే సహృదయునకు అందిస్తున్నదని అభినవగుప్తుని అభాషణం. అలా కాదు, కావ్యం ఉపదేశమే ఇవ్వాలనటమంటే అమృతం అక్కరలేదు, మకరందమే కావాలని కోరటమేకదా. ఈ సందర్భంలో మమ్మటుడు జ్ఞప్తికి రాకమానడు.

కావ్యం యశసేర్థకృతే వ్యవహారవిదే
శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతా
సమ్మితతయోపదేశయుజే....

అని ఆయన అన్నాడు. కీర్తి అర్థసిద్ధి, వ్యవహారజ్ఞానము, అమంగళ పరిహారణము కవిత్వ ప్రయోజనాలని అందరి అభిమానం కొందీ ఆయన పేర్కొన్నాడు. కాని వాస్తవానికి ఇవి నైకాంతికాలు. కవులకు మార్గాలు చూపిన మహాకవులు నామరూపాలు లేకుండనశించి నట్లు చరిత్రనుబట్టి అనుమానించవలసి వస్తున్నది. వాల్మీకి మహాముని భిక్షాటనంచేసి జీవించినట్లు ప్లేటో చెబుతున్నాడు. వ్యవహార జ్ఞానం శివేతరక్షతిశాస్త్రాల వల్లనూ సిద్ధిస్తవి. కనుక ఆయన పేర్కొన్న ప్రయోజనాలలో అసందిగ్ధమైనది సద్యఃపరనిర్వృతి ఒక్కటే.

మరొక విశేషం-ఏ శాస్త్రానికైనా ఏవిద్యకైనా మూలం భావన. ఈ భావనను వర్ధిల్ల చేసేవి స్వప్నాలు, కవిత్వాది లలితకళలుమాత్రమే. ఇంతకూ కవిత్వాది లలితకళలవల్ల అలౌకిక అనంవృత్యనుభావం, జీవితార్థవత్త, దృష్టిశైథిల్యం, సహానుభవం సద్యః పరనిర్వృతి భావుకత లభిస్తవి.

ఇంతవరకూ సిద్ధాంతాన్నిబట్టి నిష్పన్నమైన కావ్యస్వరూపం చెప్పుకొన్నాము. కాని సిద్ధాంతానికీ ఆచరణకూ తేడా ఎప్పుడూ ఉంటుంది. త్రిభుజంలోని మూడుకోణాల మొత్తం 140 డిగ్రీలు ఉండాలి. కాని కొలిచి చూచినప్పుడు కొంత వ్యత్యాసం కనిపించటం విద్యార్థుల కనుభవసిద్ధమే. అలాగే కవిత్వ విషయంలో గూడ.

మనస్సు లక్కవంటిది. లక్కకు ఘనత్వము, శైథిల్యం. ద్రవత్వము అని మూడు అవస్థలున్నవి. ఘనత్వావస్థలో లక్క ఏ ముద్రనూ స్వీకరించదు. శైథిల్యావస్థలో వేసినముద్రను స్వీకరిస్తుంది. కాని గట్టి ఒరపిడి కలిగితే ఆ ముద్ర నిలువదు, ద్రవత్వావస్థలో ద్రవత్వకణం అంతులోపడి ఘనీ

భవించినప్పుడు ఆ కణం రాపిడికి రాలక అంటే నిలిచిపోతుంది.

మనస్సుకు గూడ యీ అవస్థలు చెప్పుకోవచ్చును. కొన్ని రచనలను కబుర్లు విన్నట్లు వింటాము. శబ్దాలంకారప్రధానమైన పద్య కవిత్వం, ఆమూలాగ్రం చదివించటం ఒక్కటే విశేషంగా గలిగిన కథలు నవలలు నాటకాలు యీ కోవలో చేరుతవి. కొన్ని రచనలు చదువుతున్నప్పుడు మనశ్శైథిల్యం కలుగుతుంది. ఈ స్థితిలో బాహ్యప్రపంచం మరచిపోతాము. కాని తన్మయీభావం కలుగదు. అహంతకు ద్రుతివుండదు. వర్ణ కవిత. తెలుగుప్రబంధాలు— తన్మయీభావం కలిగించే ఘట్టాలు వినా- షా నాటకాలు, పాఠకుల వ్యక్తిత్వాలను మరపింపక చదివించే కథలు. నవలలు, నాటకాలు యీ కోవకు చెందుతవి. యీ మాట కొందరికి కోపకారణం కావచ్చును. కాని ఎవరి అనుభవాన్నివారు పరిశీలించుకొని పఠనసమయంలో అహంత లయించినదో లేదో గుర్తుకు తెచ్చుకోవాలి. తన్మయులై వర్ణనీయార్థంలో కరగిపోయాయనుకోకుంటే యీ పైని చెప్పినది అయథార్థమే.

ఇంక మూడవజాతి రచనలు సమాధ్యవస్థను కల్పించి అహంతను లయింపజేసి తమతమ పాత్రలలోనో, సన్నివేశాలలోనో, వర్ణనీయార్థాలలోనో దాదాపు మిళితం చేసివేస్తవి. ఈ స్థితిలో మనస్సు పూర్తిగా కరగిపోయిన లక్కవలె రచనా ప్రతిపాద్యాలైన అర్థాలన్నిటినీ తనలో లీనం చేసుకొంటుంది. ఇలా లీనమైపోయిన అర్థాలు అమరణం మనసులో నిలిచిపోతవి. ఉత్తరకాలంలో తిరిగి ద్రవత్వంపొందినప్పుడు గూడ వెనుకటివాటిని కోల్పోక క్రొత్తవాటిని గ్రహిస్తుంది. ప్రాత వాటితో క్రొత్తవాటిని చేర్చుకొని పరిపుష్టి పొందుతుంది. ఈ స్థితిని కల్పించే రచనలకు లక్ష్యాలుగా కాళిదాసుని కావ్యాలు. సంస్కృత నాటకాలు. టాల్‌స్టాయి డాస్టవాస్కీ, చెకోవ్, టాగూరుల ఉత్తమ కథలు, వేలూరి శివరామశాస్త్రిగారి డిప్రెషన్ చెంబు, ఇబ్సెన్, యూజీన్. ఓనిల్ సింజ్, ఒకేసి ల రూపకాలు పేర్కొనవచ్చును

ఇక నాల్గవ జాతి రచనలు సబీజ సమాధ్యవస్థ కల్పించి క్రమక్రమంగా నిర్బీజసమాధ్యవస్థకు కొనిపోతవి. ఈ రచనలు పాఠకునకు తన్మయీభావం కలిగించి కట్టకడపట విషయ రహితమైన సమాధ్యవస్థ కల్పిస్తవి. సంస్కృతంలో భారత భాగవత రామాయణాలు. తెలుగులో భారతం, ఇంగ్లీషులో షేక్స్పియర్ విషాదాంత నాటకాలు ముఖ్యంగా హేంలెట్-కాఫ్కా వ్రాసిన ట్రయల్. కాజిల్ అన్న రచనలు యీ కోవకు చెందుతవి. ఈ జాతి రచనలు ఉత్తమోత్తమాలు.

మొత్తంమీద సాహిత్యంగా పరిగణింపదగిన రచనలను నాలుగు తరగతులుగా విభజించవచ్చు. మనఃకాఠిన్యం సడల్పక ఆసక్తిని మాత్రం కలిగించే రచనలు సామాన్యాలు. మనశ్శైథిల్యం మాత్రమే కల్పించేవి మధ్యమాలు. చిత్తద్రుతి కలిగించి తన్మయీభావ మాపాదించేవి ఉత్తమాలు: నిర్బీజసమాధ్యవస్థ కల్పించేవి ఉత్తమోత్తమాలు.

ఈ విభాగం సామాజికుల హృదయస్పందనంపై ఆధారపడుతున్నది. మరి యీ హృదయాలు మనస్సులు ఒకేస్థాయిలో ఉండవు. కొందరి మనస్సులు సుశ్లథాలు సుద్రవాలు మరికొందరివి యీషచ్ఛథాలు, ఈషద్ద్రవాలు: వేరొక కొందరివి దుశ్శ్లథాలు దుర్ద్రవాలు. దీనికితోడు అగంతుకాలైన అధివ్యాధులు. కఠోరదృష్టులు, విప్లవారు స్వాభావిక మానసిక స్వాస్థ్యం చెరిచి కావ్యార్థాలను యథాతథం గ్రహించనీయవు. ఈ చిక్కులన్నీ పరిహరించటం కోసమే 'ఏషాం కావ్యానుశీలనాభ్యాసవశాద్విశదీభూతే మనోముకురే వర్ణనీయ తన్మయీభావ యోగ్యతాతే సహృదయసంవాదభాజః సహృదయాః' అని అభినవగుప్తుడు నిర్వచించాడు. ఈ నిరుక్తిలోని కావ్య శబ్దాన్ని కొందరు సంస్కృత కావ్యానికి పరిమితం చేయాలంటారు. వీరు—గుణాః ప్రమాణం దిశాం విభాగః —అన్న సూక్తిని విస్మరించి సంవృతిని వరిస్తున్నారు. కనుక అభినవగుప్తుని నిర్వచనం యథాతథం గ్రాహ్యం.

ఈ సందర్భంలో మరొక అంశం సంస్మరణీయం. మానవుని మనస్సు కొంతవరకు అతని వయస్సుమీద ఆధారపడుతున్నది. బాల్యంలో వీరాద్భుతాలు రుచించినంతగా శృంగారాదులు రుచించవు. యౌవనంలో శృంగారాదులు మరులుకొలిపినంతగా అద్భుతాదులు మరులుకొలుపవు. కౌమారంలో కరుణాదులు నచ్చినంతగా ఇతరాలు నచ్చవు. వార్ధకంలో శాంతాదులు హత్తినట్లు శృంగారాదులు హత్తవు.

ఇంతవరకు పేర్కొన్న అంశాలను గమనించినప్పుడు రచనలోని ఉత్తమోత్తమాది భేదాలను అసందిగ్ధంగా సర్వజన సమాదరణీయంగా నిర్ణయించటం దుష్కరమని బోధపడక మానదు

వ్యవస్థాభిలాషియైన సహృదయుడు రచనలలోని తారతమ్యాలను నిర్ణయించుకొనేటప్పుడు తన వయస్సును, అభిమతాలను స్మరించి. వాటికి విపరీతాలై ఇంతకుపూర్వం పేర్కొన్న అవస్థలలో కలుగుతున్న వాటినిబట్టి ఆయా కోవలకు చెందిన కృతులుగా పరిగణించవలసి వుంటుంది. వయస్సు మున్నగువానికి అనుగుణాలైన రచనల విషయంలో పాఠకుడు తన నిర్ణయాన్ని ప్రామాణికంగా భావించుకొనకపోవటం మేలు. దీనివలన ప్రమాదానికి తావుండదు.



'గోల్కొండ ముట్టడి' నాటికలో పాల్గొన్న నటీనట బృందం (విజయవాడ కేంద్రమునుండి ప్రసారితము,

# వివిధభారతి




మార్చి 16-వ తేదీ బుధ వారం నుండి మార్చి 31-వ తేదీ గురువారం వరకు

I వ ప్రసారము
ఉ॥ 7.00 నుండి 9.30
II వ ప్రసారము
10.15 నుండి 12.3
III వ ప్రసారము
మ॥ 2.00 నుండి 5.30
IV వ ప్రసారము
సా॥ 6.30 నుండి 10.40

(శనివారములు IV వ ప్రసారము 6.30 నుండి రా॥ 11.10 వరకు)

**ఉ॥ ప్రసారము I**

19.71 మీ (6035 కిలోసై)
49.30 మీ 6085 కిలోసై)

7.00 వందన్‌వార్ భక్తి గీతావళి
7.30 అర్చన
7.40 ఝలక్ కార్యక్రమ విశేషాలు
7.45 ఉదయగాన్ దేశభక్తిగీతాలు, బృందగానం
8.00 మంజూష జానపద ప్రాంతీయ సంగీతం
8.15 హిందీలో వార్తలు
8.30 జయమాల
9.30 ప్రసార సమాప్తి

**ప్రసారము II**

41.44 మీ (7240 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

10.15 బసవంతి
10.30 తరంగ్ రంగ్
10.50 సమాచార్ హిందీలో వార్తలు
10.55 సంగీత సేతు

**ఆదివారాలు ముఖ్యమైన పండుగ దినాలు**

11.00 చిత్రధ్వని సంక్షిప్తశబ్దచిత్రం (హిందీ)
(ప్రతి నెలా 1, 3, 5 ఆదివారములలో
రత్నాకర్ సంగీతం, హాస్యరచనలు, పాటకథలు
(ప్రతి నెలా 2, 4, ఆదివారాలు, పండుగదినాలు)

11.00 జయమాల (అన్ని రోజులు)
12.30 ప్రసార సమాప్తి

**మ॥ ప్రసారము III**

31.25 మీ (9600 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

[ఆదివారాలు పండుగ దినాలు]
2.00 అప్నాఘర్ మీ ఇంట్లో అందరికీ
[వారములో ఇతర రోజులలో]
2.00 ఫుల్వాడీ సంగీత కదంబం
[వారములో అన్నిరోజులు]
2.30 జయమాల
3.30 చౌపాల్ మాటలు, పాటలు

**కర్ణాటక సంగీత కార్యక్రమము**

3.45 అంజలి-గీతావళి

31.20 మీ (9615 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

4.00 గీతమాలిక
4.30 మధురగీతం మీరు కోరిన పాటలు (ఆది, బుధ, శుక్రవారములు)
5.30 ప్రసార సమాప్తి

**సా॥ ప్రసారము IV**

31.33 మీ (95 5 కిలోసై)
49.30 మీ (6085 కిలోసై)

6.30 రాగ్ రంగ్
6.45 జయమాల యుద్ధ సైనికులకు
7.45 వాద్యమాధురి వాద్య కదంబం
8.00 గజరా
8.15 హిందీలో వార్తలు
8.30 మెహ్-ఫిల్ కదంబం
9.00 చతురంగ్ పాటలు
9.15 హవామహల్ నాటికలు, రూపకములు హాస్యరచనలు
9.30 జయమాల
10.30 నూపుర్
10.35 సమాచార్ హిందీలో వార్తలు
10.40 ప్రసార సమాప్తి

**శనివారములు**

10.30 గీత మంజరి లలిత సంగీతం
11.00 నూపుర్
11.05 సమాచార్
11.10 ప్రసార సమాప్తి

**బెంగుళూరు - బి**

365.9 మీ (820 కిలోసై)
వివిధభారతి (రిలే)

| ఆదివారములలో | ఇతర రోజులలో |
|---|---|
| ఉ॥ 7.00 నుండి 8.30 | ఉ॥ 7.00 నుండి 9.30 |
| 10.50 నుండి 12.50 | 1..50 నుండి 11.50 |
| మ॥ 2.00 నుండి 3.10 | మ॥ 2.00 నుండి 3.00 |
| 4.00 నుండి 5.00 | 4.00 నుండి 5.00 |

సా॥ 6.30 నుండి 10.30 వరకు సా॥ 6.30 నుండి 10.30 వరకు

[వివరాలు 48-వ పేజీలో]

ఇతర వివరములకు: ప్రొడ్యూసర్, 'వివిధభారతి' ఆకాశవాణి, పోస్ట్‌బాక్స్ 4, బొంబాయి-1

Printed at Arutperunjoth Press, Madras-1—Edited and Published by the Station Director All India Radio, Madras-4.



డా॥ పోణాల వెంకటరాజమన్నారు-రచన-నాటిక: సింహగిరి (మద్రాస్ మార్చి 21)



శ్రీరంగం శ్రీనివాసరావు-ప్రసంగం: సాహిత్య రచనా ప్రక్రియలు-తెలుగులో (మద్రాస్, మార్చి 29,



మరుపూరు కోదండరామిరెడ్డి-ప్రసంగం: మేధావి కట్టమంచి రామలింగారెడ్డిగారు (విజయవాడ, మార్చి 30)



పిడిద కామేశ్వరరావు-సమర్పణ: ఉగాది పిల్లల ప్రత్యేక కార్యక్రమము (విజయవాడ, మార్చి 23)



బందా కనకలింగేశ్వరరావు-రేడియో అనుసరణ: 'కల్కిరాజ్య పతనం' (విజయవాడ, మార్చి 25)



ప్రయాగ నరసింహశాస్త్రి-వినోదాల పితయ్య (విజయవాడ, మార్చి 23)



కె. రామభద్రరావు-రచన: నాటిక 'నవవసంతం' (విజయవాడ, మార్చి 22)

 Regd. No. M. 5404



మద్రాసు కేంద్రమున స్వాగతం చెప్తున్న దృశ్యం



రచయితలు, ఇతర ప్రముఖులతో చర్చించు దృశ్యం

## అఖిలభారత సంగీత కార్యక్రమము



బడేగులాం అలీఖాన్



(మార్చి 19)



మునావర్ అలీఖాన్



ముసిరి సుబ్రహ్మణ్య అయ్యర్ (మార్చి 26)



టి. కె. గోవిందరావు





బి. లక్ష్మణరావు—ప్రసంగం (విజయవాడ, మార్చి 21)